## "పరులజోక్యాన్ని సహించం"

### డలెస్‌కు కైరో సమాధానం

కైరో, ఆగస్టు 31: తన సొంత వ్యవహారాల్లో ఇతరులజోక్యాన్ని ఈజిప్టు ఎంతమాత్రమూ సహించదని కైరో రేడియో నేడు ఉద్ఘాటించింది. ఇస్రేల్ ఈజిప్టులసరిహద్దులో ఎవ్వరూ బలప్రయోగం చేయరాదంటూ అమెరికా విదేశాంగ మంత్రి డలెస్ చేసిన సూచనను వ్యాఖ్యానిస్తూ కైరో రేడియో ఈవిధంగా ఉద్ఘాటించింది.

"గాజాలో ఈజిప్టు తనకు నీతిని, తన హక్కును రక్షించుకుంటున్నదని డలెస్ తెలుసుకోవాలి. తన సొంత వ్యవహారాల్లో ఇతరులెవ్వరి జోక్యాన్నీ ఈజిప్టు సహించదనికూడా ఆయన తెలుసుకోవాలి. ఈ జిప్టు మొదలైన అరబ్ దేశాలు ఆయుధాలకోసం ఎన్ని సార్లు కోరినా అమెరికా నిరాకరించింది. పశ్చిమరాజ్యాలు అరబ్ దేశాలకు ఆయుధాలివ్వ నిరాకరిస్తూ, ఇస్రేల్‌ను ఆయుధాలతో ముంచెత్తినవి" అని కైరో రేడియో విమర్శించింది.

### డలెస్ ప్రకటనపై రష్యా ఖండన

వాషింగ్టన్, ఆగస్టు 31: అరబ్ రాజ్యాలకు రష్యా ఆయుధాలు సమకూర్చ బోతున్నదని డలెస్ చేసిన ప్రకటనలోని అర్థం నిజంకాదని, రష్యాకు అట్లా ఎవరికీ ఆయుధాలు సప్లయి చేసే ఉద్దేశం లేదని ఇక్కడి సోవియట్ వర్గాలవారు అంటున్నారు.

### సూడాన్ తిరుగుబాటు సైనికుల భయం

ఖార్టూం, ఆగస్టు 30: కేవలరకంగా లొంగిపోతామన్న సూడాన్ సైనిక విప్లవకారులు పలువురు, ప్రభుత్వసేనలు టోరిట్‌కు వచ్చేలోగానే పరారీ అయిపోయినట్లు దక్షిణాది నుండి వచ్చిన వార్తలు తెలుపుతున్నాయి.

విప్లవకారులనాయకురుడినీ, అక్కడి మిషనరీ కేంద్రాలలో తలదాచుకున్న ఉత్తరాది ప్రాంతాల సైనికులు కొత్తవారొలు వచ్చిన తర్వాత బయటకు వచ్చారనికూడా ఈవార్తలు తెలిపాయి.

### డా॥ భాబా మాస్కోకు రాక

మాస్కో, ఆగస్టు 30: శాంతిప్రయోజనాలకు అణుశక్తి వినియోగంపై జరిగిన జెనీవా సభకు అధ్యక్షత వహించిన, భారత అణుశక్తి సంఘాధ్యక్షుడు డా॥ హోమీ. జె. భాబా నేడు మాస్కో వచ్చారు.

సోవియట్ విజ్ఞానశాస్త్ర పరిషత్ ఆహ్వానంపై డా॥ భాబా ఇక్కడకు వచ్చారు.

### టిటో అధ్యక్షునికి అస్వస్థత

వియన్నా, ఆగస్టు 31: జెకోస్లోవేకియా అధ్యక్షుడు జపోటాకీకి చిన్న పెద్ద జబ్బుచేసిందని ప్రాగ్ రేడియో నేడు ప్రకటించింది.

### చైనాలోని జపాన్‌ఖైదీల విడుదల?

టోకియో, ఆగస్టు 31: జపాను యుద్ధ నేరస్థులను విడుదల చెయ్యడానికి చైనా త్వరలో పూనుకోవచ్చునని క్యోడో వార్తాసంస్థ తెలియజేస్తున్నది.

### బెంగాల్లో పత్తి, తేయాకుపై పన్ను

కలకత్తా, ఆగస్టు 30: కలకత్తాలో అమ్మకం, వాడుక నిమిత్తం తీసుకొచ్చే జూపండ్లపైన, తేయాకుమీద పన్నులు విధించడానికి అధికారమిచ్చే ఒక బిల్లును ముఖ్యమంత్రి శ్రీ బి. సి. రాయ్ నేడు శాసనసభలో ప్రవేశపెట్టారు పౌను తేయాకుకి ఒకఅణా చొప్పున యీపన్ను విధిస్తారు. అభివృద్ధి పథకాల అవసరాలకోసం ఆదనపు రాబడి మార్గాలలో ఇది ఒకటని శ్రీ రాయ్ చెప్పారు.

కలకత్తా నుండా ఏటా 50 కోట్ల పౌనుల తేయాకు ఇతర ప్రాంతాలకు, దేశాలకు, వెడుతున్నది. అయితే ఇంత స్వల్పంగా తేయాకు ధర పెరగబోదని భావిస్తున్నట్లు శ్రీ రాయ్ చెప్పారు. పశ్చిమ బెంగాలులో అమ్మకం పన్ను ద్వారా వసూలయ్యే మొత్తంకంటె బొంబాయిలో వసూలయ్యే మొత్తం మూడురెట్లు అధికంగావుంటుందని, అందువలన యీ క్రొత్తపన్ను గురించి అంతగా గాభరాపడవలసిన అవసరం లేదని అన్నారు.

ప్రతిపక్ష సభ్యులు యీ బిల్లు ప్రవేశపెట్టడానికి చాలా ఆక్షేపణలు తెచ్చారు. కాని అవి సరిగాలేవని సభాధ్యక్షుడు త్రోసిపుచ్చారు.

### 'శారద' మృతికి సంతాపం

మద్రాసు, సెప్టెంబరు 1: ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికద్వారా నవలా రచయితగా సుపరిచితులైన శారద (ఎస్. నటరాజన్) మృతికి ఖడ్గపురం ఆంధ్రరచయితలసంఘం ఆంధ్ర అభ్యుదయ రచయితలసంఘ కార్యదర్శి టి. వెంకట్రామయ్య, విల్లివాకం ఆంధ్ర సంఘం, మద్రాసు ప్రైవేటు పాఠశాల ఆంధ్రభాషాభివృద్ధి సంఘం, ఘంటసాల గ్రామంలోని రచయితలు, పి. గణపతిశాస్త్రి, ఎస్. ఎస్. భవాని ప్రభృతులు సంతాపం తెలుపుతూ వారికుటుంబానికి సానుభూతి తెలుపుతున్నారు.

## రక్షణ సన్నాహాలు తనిఖీ చేసే పరిశీలకులు

### అమెరికా ప్రతిపాదన: మిగతా రాజ్యాల ముభావం

న్యూయార్కు, ఆగస్టు 30: అమెరికా రష్యాలలో ఏ ఒకటీ రెండవ దానిపై హఠాత్తుగా దండెత్తివచ్చే ప్రమాదం లేకుండా, ఎవరి సన్నాహాలు ఎలా ఉన్నదీ ఎప్పటికప్పుడు పరస్పరం తెలుసుకోడానికి, విమానాలమీద పరిశీలకబృందాలను పంపడంతోపాటు, రెండు దేశాలలోని కీలక కేంద్రాలలోనూ పరిశీలకులను కూడా నియోగించాలని, ఆయుధ విసర్జన వ్యవహారం జరుగుతున్న ఐదురాజ్యాల సమావేశంలో అమెరికా ప్రతినిధి హెరాల్డు స్టాసెన్ ఇవాళ ప్రతిపాదించారు.

ఈ భూమి పరిశీలకుల నియామకాన్ని ఐసెన్‌హోవర్ పథకానికి ఆయన జతపరచారు.

"రెండు దేశాలూ పరస్పరం తెలుపుకునే సైనిక సమాచారం సరియైనదో కాదో తనిఖీచేసి ఖరారుగా తిరుగు దేశాలకు చెప్పడానికి, హఠాత్తుగా దండెత్తగల ప్రమాదాల గురించిగాని, అందుకు జరిగే సైనిక సమీకరణాది ప్రయత్నాల గురించిగాని ముందుగా హెచ్చరిక చేసుకోడానికి కీలకకేంద్రాలలో భూపరిశీలకులను నియోగించవలసిన అవశ్యకతను రెండుదేశాలూ గుర్తించాయి" అని స్టాసెన్ ఈ సందర్భంలో అన్నారు.

రేవులూ, రైల్వే కేంద్రాలు, రహదారులు, విమానాశ్రయాలు మొదలైన కీలక కేంద్రాలలో ఒకదేశంలో మరొకదేశం పరిశీలక కేంద్రాలు నెలకొల్పాలన్న సోవియట్ ప్రతిపాదన అమెరికా అంగీకరిస్తున్నట్లే భావించవచ్చునని ఇవాళ ఈ ప్రతిపాదనలు చూచిన మీదట అభిజ్ఞులు అన్నారు హఠాత్తుగా ఒకరిమీద ఒకరు దండెత్తే ప్రమాదం లేకుండా, హెచ్చరికలు చేసుకోవడానికి ఏర్పాట్లు జరగాలన్న అంశంపై అమెరికా రష్యాలు ఏకీభవించినట్లే తేలుతున్నదన్నారు

### ప్రతినిధుల ముభావం

అయితే, స్టాసెన్ ఇవాళ ఈ ప్రతిపాదనలు చేసినపుడు, సమావేశంలో పాల్గొన్న మిగతాదేశాల ప్రతినిధులలో ఏ ఒకరూ ఔనూ కాదూ అని అనలేదు. బహుశా, తమతమ ప్రభుత్వాలు ఈ ప్రతిపాదనను జాగ్రత్తగా పరిశీలించి ఏ సంగతీ చెప్పేవరకూ ఈ ప్రతినిధులు ముభావంగానే వుండవచ్చు.

### వెనకపడ్డప్రాంతాలలో పరిశ్రమలు ప్రత్యేకప్రాధాన్యం అవసరమన్నశ్రీ నెహ్రూ

డిబ్రూఘర్, ఆగస్టు 30: "వెనకపడ్డ ప్రాంతాల పారిశ్రామికాభివృద్ధికి ప్రత్యేక ప్రాధాన్యం ఇవ్వటం అవసరం. దేశమంతా సమానంగా వృద్ధి చెందాలనే మనం కోరుతున్నాం" అని భారత ప్రధాని నెహ్రూ నేడిక్కడ విలేఖరుల గోష్ఠిలో స్పష్ట పరిచారు.

అస్సాం రాష్ట్రపారిశ్రామికాభివృద్ధి విషయమై భారత ప్రభుత్వ వైఖరిని గురించి ఒక విలేఖరి ప్రశ్నించగా ఆయన ఈ జవాబు ఇచ్చారు.

"పెద్ద పరిశ్రమలను నెలకొల్పేటప్పుడు ముడిపదార్థాల సప్లయి, విద్యుచ్ఛక్తి సప్లయి, రవాణా సౌకర్యాలు మొదలైన అంశాలన్నిటినీ గమనించాలి పారిశ్రామికాభివృద్ధికి ఇనుము, బొగ్గు కీలక పదార్థాలుగా ఉన్నవి కనుక ఇంగ్లండ్, పశ్చిమ యూరపులు పారిశ్రామికంగా అభివృద్ధి చెందినవి. ఇప్పుడు కూడా అవే కీలక పదార్థాలుగా ఉన్నవి. ఇవి తూర్పు బీహార్, పశ్చిమ బెంగాల్‌లలో కొంత భాగం, ఒరిస్సాలో కొంత భాగంలో సమృద్ధిగా ఉన్నవి.

అయితే దేశంలో మిగిలిన ప్రాంతాల్లో ఇతర సౌకర్యాలు ఉన్నవి. అస్సాంలో ఎన్నో సంపదలు ఉన్నవనీ, ఈ రాష్ట్రాన్ని పారిశ్రామికంగా ఎంతో వృద్ధి చేయవచ్చుననీ నేను భావిస్తున్నాను. ముఖ్యంగా జల విద్యుత్ ఉత్పత్తికి అస్సాంలో చాలా సౌకర్యాలు ఉన్నవని నా నమ్మకం. మన జలవిద్యుత్ అవకాశాలను అంచనా వేయటంలో మన నదుల శక్తినంతా సరిగా అంచనా వేయలేదనే నేను అనుకుంటున్నాను" అని నెహ్రూ వివరించారు.

(అస్సాం రాష్ట్రానికి పారిశ్రామికాభివృద్ధిలోనూ, సమాచార సౌకర్యాల విస్తరణలోనూ ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వబడుతుందని ప్రధాని నెహ్రూ తనతో అన్నారని అస్సాం ముఖ్యమంత్రి మేథీ నేను తేజ్‌పూర్‌లో వెల్లడించారు.)

### జగ్గయ్యపేటలో తారురోడ్లు

జగ్గయ్యపేట, ఆగస్టు 30: పంచాయితీబోర్డు సభ్యులు సామి నేని విశ్వనాధంగారి అధ్యక్షతన సమావేశమై, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, మొదటి మూడేండ్లు పట్టణంలో ఎక్కడెక్కడ తారురోడ్లు వేయాల్సింది నిర్ణయించారు కొన్ని కంకర రోడ్లకు పన్ను మంజూరుచేశారు. స్వ. వి.

### భాక్రానంగల్ విద్యుదుత్పత్తి

#### అనుకున్న సప్లయికి లోపంరాదని ప్రకటన

న్యూఢిల్లీ, ఆగస్టు 30: భాక్రానంగల్ ప్రాజెక్టులోచేస్తున్న మార్పుల వల్ల దాని యొక్క విద్యుదుత్పాదన శక్తి కేమీ లోపం జరగదని కేంద్రం నీటివనరు విద్యుత్ శాఖవారు నేడు ప్రకటించారు.

ఈ మార్పులవల్ల ఈ ప్రాజెక్టు విద్యుదుత్పాదన శక్తి దెబ్బతింటుందని, ఇంజనీర్ల సంఘం సిఫార్సులు ప్రకటించిన అనంతరం, కొన్ని పత్రికలు ప్రచారం ప్రారంభం చేశాయి. ఆ ప్రచారం నిజంకాదని నేడు ఈ ప్రకటనచేశారు.

ఈ జరిగే మార్పులవల్ల ప్రాజెక్టులో ఒక యూనిట్ తగ్గుతుంది. అందువల్ల రూ 2½ కోట్లు కలిసి వస్తుంది. అంతేగాని నష్టం ఏమీ జరగదు. ఢిల్లీకి, ఎరువుల ఫ్యాక్టరీకి మామూలుగానే ప్రాజెక్టు విద్యుత్తు లభిస్తుంది. రాజస్థాను, పెప్సూలకు గూడా ఏమీ నష్టం జరగదు అని ఇందులో వీరు స్పష్టంచేశారు.

### భూములు ఛిన్నాభిన్నమయ్యే ప్రమాదం

#### హైదరాబాదు సంఘ నివేదిక

హైదరాబాద్, ఆగస్టు 30: తూర్పు పంజాబులో, ఉత్తర భారత రాష్ట్రాలలోను ఉన్నంతప్రమాదం లేకపోయినా హైదరాబాదు రాష్ట్రంలో భూములు ఛిన్నాభిన్నమైపోయే ప్రమాదం ఉన్నదని హైదరాబాదు భూమి విచారణ సంఘం తెలియజేసింది.

రాష్ట్ర వ్యవసాయార్థిక వ్యవస్థకు ఇది కొంతవరకు విఘాతకరంగా పరిణమించవచ్చుననికూడా భూమి విచారణ సంఘం తెలియజేసింది.

రాష్ట్రంలో వ్యవసాయ క్షేత్రాలు బాగా భిన్నమైపోయే ప్రమాదం ఏర్పడిన ప్రాంతాలలో చిన్నచిన్న వ్యవసాయక్షేత్రాలన్నీ ఏకంచేసే ప్రణాళికలమలులో పెట్టవలసిందని వీరు సూచించారు.

నాలుగుప్రదేశాలలో సుమారు 25 గ్రామాలలో మొట్టమొదటగా వ్యవసాయక్షేత్రాలను ఏకంచేసేపని ప్రారంభించవలసిందనీ దీనివల్ల పరిసర ప్రాంతాలలో వ్యవసాయక్షేత్రాలు చిన్నవైపోయే ప్రమాదం తొలగిపోగలదనీ ఈ నివేదిక సూచించింది.

### చుండూరులో చక్కెర ఫ్యాక్టరీ

తెనాలి, ఆగస్టు 28. చుండూరు సహకార పంచదార ఫ్యాక్టరీ స్థాపన విషయంలో చెరకు ఉత్పత్తిదారుల సమావేశం నిన్న శ్రీ గోవాడ పరంధామయ్య అధ్యక్షతన జరిగినది. సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు శ్రీ బి. నరసింహపట్నాయక్ (గుంటూరు దక్షిణం) త్వరలో ఏర్పాటు కానున్న సహకార సంఘ నిబంధనలు, పెట్టుబడి, డైరక్టర్లు, వగైరా విషయాలపై వివరించి చెప్పారు.

ఉత్పత్తిదారులు రు 15 లక్షలు ఆంధ్రప్రభుత్వం రు 15 లక్షలు పెట్టుబడి పెట్టవలసి వస్తుందనీ, కేంద్రప్రభుత్వంగాని పారిశ్రామిక పెట్టుబడి సంస్థగాని మరో రు 30 లక్షలు పెట్టుబడి మూలధనం మంజూరు చేయాల్సి వస్తుందనీ, తెలుస్తున్నది. ఈ సంఘం పేరుతో అప్పుడే తెనాలి సహకార కేంద్ర బ్యాంకులో అక్కౌంటు తెరిచారు. ప్రారంభంలో అవసరమైన రు 3 లక్షలు ధరావతు చేయడానికి ఉత్పత్తిదారులు ఉత్సాహంతో ముందుకు వస్తున్నారు.

ఫ్యాక్టరీ స్థాపనకు అనుమతించాల్సిందిగా చెరుకు లైసెన్సింగు సంఘానికి పెట్టుకున్న దరఖాస్తు పరిశీలనలో వున్నది.

తిరిగి సెప్టెంబరు 4న ఉత్పత్తిదారుల సమావేశం జరుగుతుంది.

INDIA POSTAGE
14 AS
29.5.53
CONQUEST OF EVEREST

'ఎవరెస్టు విజయ' చిహ్నంగా భారత తంతి తపాలాశాఖ 1953 లో విడుదల చేసిన ఈ తపాలాముద్ర (14 అణాలది) 'సేవరల్ ఇటాలియన్ ఒలింపిక్ బహుమానాన్ని' అందుకుంది. ఆ ఒలింపిక్ కమిటీ అధ్యక్షుడు ఈ ముద్రను సర్వత్రా ఉపయోగంపై ముద్రించిన తపాలా ముద్రలలో అత్యంత మనోహరమైనదని అభివర్ణించారు. అంతర్జాతీయ బహుమతినందుకున్న మొట్టమొదటి భారతీయ ముద్ర ఇదే. నాసిక్‌లోని 'ఇండియన్ సెక్యూరిటీ' ముద్రణాలయంవారు దీన్ని ముద్రించారు.

వెస్టిండీస్ దీవులలో భారతదేశపు ప్రతినిధి (కమిషనర్)గా ఉంటున్న బి. ఎన్. నందా విండ్‌వర్డ్ దీవులకు కూడా భారతప్రతినిధిగా నియోగించబడ్డారు. మొన్ననే ఆయన ఈ దీవుల గవర్నర్ సి. ఎం. దేవరావ్‌కు యోగ్యతాపత్రాలు సమర్పించారు. ఇక్కడికి భారత ప్రతినిధిని నియమించడం ఇదే తొలిసారి. ఈ సందర్భంలో శ్రీ నందా గవర్నర్ సతికి 'కాంగ్రా లోయ' వర్ణచిత్రాల సంపుటాన్ని బహూకరించారు.

## తెనాలి పట్టణం స్థితి సంతృప్తిగా లేదు

### మురికి పేటలను బాగుచేయాలని స్థానికసంస్థలమంత్రి సలహా

తెనాలి, ఆగస్టు 31: ఈ పట్టణంలో పారిశుద్ధ్య స్థితి యేమీ సంతృప్తికరంగా లేదని పట్టణాన్ని సుందరంగా చేయడానికి పురపాలకసంఘం కృషి చేయవలసివున్నదని, స్థానిక సంస్థల మంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావుగారు హెచ్చరించారు.

పట్టణ సౌందర్యం చాలామటుకు మురికిపేటల తొలగింపుపై ఆధారపడి ఉంటుందిగాబట్టి, ఆ పని సాధించడంపైనే పురపాలక సంఘం కేంద్రీకరించాలని విజ్ఞప్తిచేశారు.

ఈ సాయంత్రం పురపాలక సంఘానికి చెందిన రహదారిబంగళాలో కొత్త భాగానికి ప్రారంభోత్సవం చేసిన సందర్భంలో జరిగినసభలో నాగేశ్వరరావుగారు పైసలహాలు ఇచ్చారు. సభ కార్యక్రమం యావత్తు వైర్ బ్రాడ్ కాస్టింగ్ సర్వీసుద్వారా పట్టణమంతా ప్రచారం చేయబడింది.

పురపాలక సంఘాధ్యక్షుడు ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు, కొత్త భవనానికి ప్రారంభోత్సవం చేయవలసిందిగా మంత్రినికోరుతూ, రూ 30 వేలఖర్చుపెట్టి యీ భవనం కట్టించడమైందని చెప్పి, యీ నిర్మాణానికి ప్రభుత్వం రు 10 వేలు అప్పుగా యిచ్చినందుకు కృతజ్ఞత తెలిపారు.

డా॥ నాగేశ్వరరావుగారు, తమ ప్రత్యుత్తరంలో, పట్టణ పారిశుద్ధ్యస్థితి బాగుచేయడానికి పురపాలక సంఘం శ్రద్ధగా కృషిచేయాలని చెప్పారు.

పురపాలక సంఘాధ్యక్షుని వందనాలతో సభ ముగిసింది.

నాగేశ్వరరావుగారు యిక్కడికి రాజమండ్రినుంచి వచ్చారు. వారికి స్టేషన్‌లో జిల్లా పంచాయితీ ఆఫీసరు, టి. కమలావిష్ణు, అలపాటి వెంకట్రామయ్య, ఆర్. సి. ఓ. సత్యనారాయణ, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు వి. కామేశ్వరరావు, పురపాలకసంఘాధ్యక్షులు ఎ. గోపాలకృష్ణమూర్తి, పురపాలక ఇంజనీరు ఇ. వెంకటేశ్వరరావు కమీషనర్ ప్రభృతులు స్వాగతమిచ్చారు.

తరువాత డా॥ నాగేశ్వరరావుగారు ఆయుర్వేద కళాశాల, ... సందర్శించారు. కళాశాల ప్రిన్సిపాల్ ఏ వెంట్రు శ్రీరాములుగారు స్వాగతమిచ్చి, కళాశాల, ఆస్పత్రి, గ్రంథాలయం, పరిశోధనాలయం వగైరాలు చూపించారు. కళాశాల తరఫున స్వాగతపత్రం సమర్పిస్తూ, వసువైద్యంలో దేశీయ వైద్యవిధానాన్ని గుర్తించి, ఆయుర్వేద పశు వైద్యాలయాలకు స్థానిక సంస్థలు గ్రాంట్లు యిచ్చే అవకాశం కల్పించాలనికోరారు. గ్రామాలలో, ఆయుర్వేద పద్ధతిని పశువులకు వైద్యం చేసేవారికి, గ్రాంట్లు ఇవ్వాలని ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసినందుకు శ్రీరాములు గారు కృతజ్ఞత తెలిపారు.

నాగేశ్వరరావుగారు, స్వాగతపత్రానికి సమాధానం చెబుతూ వైద్యశాఖ మంత్రితో సంప్రతించి, కళాశాలకు ఎక్కువ గ్రాంట్లు మంజూరు చేయించే విషయం శ్రద్ధగా ఆలోచిస్తానని వాగ్దానం చేశారు.

శ్రీయుతులు కొల్లూరు కోటయ్య, ఎస్. వీరాచారిగారలు మాట్లాడారు.

రహదారి బంగళాలో, వివిధ సంస్థల తరఫున వినతిపత్రాలను మంత్రి స్వీకరించారు. పురపాలకసంఘ కార్మికసంఘం తరఫున కార్యదర్శి ఇ. వీరయ్యగారు సమర్పించిన వినతిపత్రంలో, పురపాలక సంఘ సేవలో ఉంటున్న తక్కువ జీతగాళ్లకు గృహావసతి సౌకర్యాలు కల్పించాలని కోరారు. ఆంధ్ర రజకసంఘం తరఫున కే. శ్రీరాములుగారు సమర్పించిన వినతిపత్రంలో రజకులు బట్టలు ఉతుక్కోవడానికి చెరువులు ప్రత్యేకించాలని కోరారు.

ముద్దాలి కామేశ్వరరావుగారిఇంట్లో జరిగిన ప్రజాపార్టీ కార్యకర్తల సమావేశంలో నాగేశ్వరరావుగారు పాల్గొన్నారు.

తరువాత వాణీ విద్యాలయంలో ... చిత్రపటాన్ని ఆవిష్కరించారు.

## నీలిమందు పరిశ్రమ

### కేంద్రంతో సంప్రతిస్తానని రెవెన్యూ మంత్రి హామీ

ప్రొద్దుటూరు, ఆగస్టు 28. నీలిమందు పరిశ్రమకు సంబంధించిన అన్ని విషయాల గురించి, ఆ పరిశ్రమ పూర్వం ఎందరికి ఉపాధులు చూపగలిగినది, ఇప్పుడు అది దెబ్బతినటం వల్ల ఎందరు నిరుద్యోగులైనదీ సమగ్రంగా వివరాలు సేకరించి అందచేస్తే ఈ విషయమై కేంద్ర ప్రభుత్వంతో సంప్రతించి ఈ పరిశ్రమ పునరుద్ధరణకు ప్రయత్నించగలనని ఆంధ్ర రెవెన్యూ మంత్రి కళ్లూరి చంద్రమౌళిగారు నేడిక్కడ నీలిరంగు ఉత్పత్తి, విక్రయదారుల విజ్ఞప్తికి సమాధానం చెప్పారు.

చంద్రమౌళిగారు మైదుకూరునుండి నిన్న సాయంత్రం ఇక్కడకు వచ్చారు. రాజంపేట, మైదుకూరు, ఒంటిమిట్ట నియోజకవర్గాల శాసన సభ్యులు పి. పార్థసారథి, వి. రామారెడ్డి, బి. రత్నసభాపతిగారలు మంత్రివెంటవచ్చారు.

కడపజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు రాఘుల మునిరెడ్డిగారు, తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు నాగిరెడ్డిగారు కార్యదర్శి నారు నాగిరెడ్డిగారు, తాలూకా భూదానయజ్ఞ ప్రచారకర్ శ్రీరంగప్పగారు, తదితరులూ అల్లాడుపల్లె వరకూ ఎదురేగి మంత్రికి స్వాగతమిచ్చారు. ప్రయాణీకుల బంగళావద్ద, స్థానిక శాసన సభ్యుడు క. బాలనారాయణ రెడ్డిగారు స్వాగతం చెప్పారు.

### ముక్తిరామేశ్వరాలయం

ముక్తిరామేశ్వరం అనబడే ఈ పట్టణంలోని శ్రీ రామలింగేశ్వర ఆలయం శిథిలమైపోయినదనీ, దీని పునరుద్ధరణకు అయే ఖర్చులో ప్రజలు నాలుగోవంతు ఇస్తారనీ, ప్రభుత్వం మిగతా మూడు వంతులూ భరించి, ఇందుకు తోడ్పడాలనీ కోరుతూ డి. క. శర్మగారు మంత్రికి వినతిపత్రం సమర్పించారు. చంద్రమౌళిగారు సంగతి సందర్భాలు ఆలకించి, తాము నెల్లూర్లో తిరిగి ఇక్కడకు రాగలరనీ, అప్పుడు దేవాలయ స్థితిగతులను పరిశీలించి, ఈ విషయమై శ్రద్ధగా ఆలోచిస్తామనీ బదులుచెప్పారు.

### మరొక ఉన్నత పాఠశాల ఆవశ్యకత

తర్వాత స్థానిక పురపాలకోన్నత పాఠశాలవిద్యార్థులుమంత్రికి ఒకవినతిపత్రం సమర్పించారు. అందులో వారు ఇలా వివరించారు. ఉన్న తపాఠశాలలో విద్యార్థులసంఖ్య 1800 ఉంది. 41 సెక్షన్లు ఉన్నాయి. 1953 లో నిర్మించిన పాకలు 1954 జూలైలో అగ్నిప్రమాదంలో దగ్ధమైపోయాయి. స్థలం చాలనందువల షిఫ్టు పద్ధతిలో ఉదయం 7-30 నుండి సాయంత్రం 4-30 వరకూ పాఠశాలను నిర్వహించడం జరుగుతున్నది. మరొకవంక విద్యార్థుల సంఖ్య ఏటేటా పెరుగుతున్నది. అందువల్ల ఈపట్టణంలో మరొక ఉన్నత పాఠశాల అవసరం. ఇందుకు ప్రభుత్వం పూనుకోవాలి."

### ఆటస్థలం

విద్యార్థుల సంరక్షకుల సంఘం కార్యదర్శి ఎం. వి. ఎస్. శర్మగారు ఒక వినతిపత్రం సమర్పిస్తూ ఇక్కడి బాలికల ఉన్నత పాఠశాలకు ఆటస్థలం లేదనీ, అందువల్ల పాఠశాల ప్రక్కన ఉన్న కూరగాయల మార్కెట్ స్థలాన్ని ప్రభుత్వం స్వాధీనపరచుకొని ఈ పాఠశాలలకు కేటాయించాలనీ కోరారు.

మంత్రి ఈ విషయాలు సావధానంగా పరిశీలించి, సాధ్యమైన సహాయం చేయగలమని సమాధానం చెప్పారు.

### నీలి మందు పరిశ్రమ

ఒకప్పుడు వేలాది ప్రజలకు ఉపాధులు చూపిన నీలిరంగు పరిశ్రమ విదేశీ రంగుల పోటీవల్ల దెబ్బతిని పడిపోయిందనీ, అందువల్ల నీలి, నలుపు రంగులు మాత్రం విదేశాల నుండి దిగుమతి కాకుండా నిషేధించి, స్వదేశీ పరిశ్రమను తిరిగి వృద్ధిలోకి తేవాలనీ స్థానిక నీలిరంగు ఉత్పత్తి విక్రయదారుల సంఘం తరఫున రత్నసభాపతి, వంకదార రామస్వామిగారలు మంత్రికి విన్నవించారు. ఈ పరిశ్రమకు సంబంధించిన వివరాలు సేకరించి, అందచేస్తే, ఈ పరిశ్రమ పునరుద్ధరణ విషయమై కేంద్ర ప్రభుత్వంతో సంప్రతించగలమని మంత్రి చంద్రమౌళిగారు సమాధానం చెప్పారు.

రాత్రి 8 గంటలకు మంత్రి గౌరవార్థం, శాసనసభ్యుడు బాలనారాయణ రెడ్డిగారు విందుచేశారు.

ఉదయం 7 గంటలకు మంత్రి స్థానిక పురపాలక సంఘ ఉన్నత పాఠశాలను చూచారు. ప్రధానోపాధ్యాయుడు పి. సుందరరామయ్య, విద్యార్థి ఎం. వెంకట సుబ్బయ్యగారలు మంత్రికి పుష్పమాలలు వేసి స్వాగతం చెప్పారు.

తరువాత చంద్రమౌళిగారు యర్రగుంట్ల, ముద్దనూరుల మీదుగా కడపకు బయలుదేరారు. (స్వ. వి.)

### ఖాదీ గ్రామ పరిశ్రమల కేంద్రశిక్షణ సంస్థ

అంబాలా, ఆగస్టు 31: నిలోకేరీ (పంజాబ్)లో కేంద్రశిక్షణ సంస్థను నెలకొల్పాలని అఖిలభారత ఖాదీగ్రామ పరిశ్రమల మండలి నిశ్చయించిందని ఆ సంఘపు త్రైమాసిక నివేదికలో వెల్లడించబడ్డది.

## జాతీయ పతాకకు జరిగిన అవమానం

### నెహ్రూకు పాట్నా విద్యార్థి నాయకుని క్షమార్పణ

పాట్నా, ఆగస్టు 31: పాట్నా విశ్వవిద్యాలయ విద్యార్థుల కార్యాచరణ సంఘ అధ్యక్షుడు శ్రీ అనిరుద్ధ మిశ్రా నేడు ప్రధానమంత్రి నెహ్రూను కలుసుకుని స్వాతంత్ర్య దినంనాడు జాతీయపతాకానికి జరిగిన అవమానానికి విద్యార్థుల తరఫున క్షమాపణ చెప్పుకున్నారు.

ప్రధాని ఢిల్లీకి బయలుదేరే ముందు పాట్నా విమానాశ్రయంలో కలుసుకుని ఈ క్షమాపణ చెప్పుకున్నారు.

ఈ విశ్వవిద్యాలయ విద్యార్థుల కార్యాచరణ సంఘం పాట్నా విద్యార్థుల కార్యాచరణ సంఘానికి ప్రత్యర్థిగా ఏర్పడ్డ సంఘం.

"వెరకటి కార్యాచరణ సంఘ అతివాదుల సూచనలను అనుసరించి, జాతీయపతాకాన్ని అవమానించే ఈ దర్యలో పాల్గొనేటట్లు మమ్మల్ని ప్రోత్సహించింది. మేము దిగ్భ్రాంతులమై అవాయంగా వాటిని చూస్తు ఉండిపోయినాము. కాని ఆ సంఘటనలవల్ల కలిగిన జుగుప్స మూలంగా ఈ కొత్త కార్యాచరణసంఘాన్ని ఏర్పాటు చేసుకున్నాము" అని ఆయన ఒక నివేదికలో తెలియజేశారు.

"ఆగస్టు 15 వ తేదీ జరిగిన తప్పులను తక్కువచేసి చెప్పటానికి మేము ప్రయత్నించటం లేదు. కాని ఆగస్టు 11, 12, 13 తేదీలలో జరిగిన సంఘటనలు మాత్రం శాంతిభద్రతల రక్షణ బాధ్యత వహిస్తున్న అధికారుల ప్రవర్తనకు పెద్ద కళంకమేనని మాత్రం మేము విన్నవిస్తున్నాము. ఈ సంఘటనల్లో 6 గురు చనిపోవటం, 50 మంది వరకూ గాయపడటం జరిగింది. ఇందులో ఎక్కువ భాగం విద్యార్థులే.

### విద్యార్థుల కష్టాలు

ఆగస్టు 11, 12, 13, 15 తేదీల సంఘటనలన్నిటికీ మూల కారణం విద్యార్థులలో ఈనాడు ప్రబలి ఉన్న ఆశాభంగ పరిస్థితే కారణం.

ఈ సమస్యలపరిష్కారానికి తక్షణం తీసుకోవలసిన చర్యలతో, దీర్ఘకాలిక చర్యలూ కూడా అవసరం. మీరు మీరాదరిత్వ ఆలోచనల శక్తితో, ప్రస్తుతం మనదేశంలో పరిస్థితులన్నీ చూస్తే మీరొక్కరే ఆశక్తిని సత్తువ పుచ్చుకున్నారా అనిపిస్తున్నది-మా సమస్యలను అర్థంచేసుకుని తగిన సహకారం చేయగలరని ఆశిస్తున్నాము" అని ఆ నివేదికలో వివరించబడ్డది.

నెహ్రూ ఈ విద్యార్థి నాయకునితో ప్రసంగిస్తూ "అసలు కార్యాచరణసంఘమన్న పేరేమిటి?" అని ప్రశ్నించారు. "పేరుమార్చ నిశ్చయించి, విశ్వవిద్యాలయ అధ్యక్షునికి తెలియపరిచాము" అని అనిరుద్ధమిశ్రా జవాబిచ్చారు. ఈ కార్యాచరణ సంఘంపేరు బీహార్ రాష్ట్ర విద్యార్థి శాంతిశ్రేయస్సుల సంఘం అని పేరు పెడతారని తెలుస్తున్నది.

విద్యార్థులు సరిగా ప్రవర్తించి శాంతికోసం వివేకంతో పనిచేస్తే వారికి ఎల్లప్పుడూ తన ఆశీర్వచనాలు అందిస్తానని నెహ్రూ అన్నారు.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ అధిక భాద్ర॥ శు॥ పూర్ణిమ 1955 - శం॥ సెప్టెంబరు 2 శుక్రవారం శు॥ పూర్ణిమ 18-30 శత20-59 వర్జ్యం శా 3-20 ల 4-50కు.

ఐ॥ ప్రథమ సెప్టెంబరు 3 శనివారం శ॥ ప్రథమ 12-46 పూ॥భా 20-49 వర్జ్యం లేదు.


ఆంధ్రపత్రిక

ఒరు లేయక యొనరించిన
పరవర యత్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్
(మహాభారతము)

శ్రీమన్మథ సం॥ అధిక భాద్ర॥ శు॥ పూర్ణిమ
శుక్రవారం


## రాష్ట్ర ప్రణాళికలు: ప్లానింగ్ కమీషన్ వైఖరి

బి తరగతి రాష్ట్రాల్లో హైదరాబాదురాష్ట్రం మైసూరు, తిరువాన్కూరు - కొచిన్ రాష్ట్రాలంతగా అభివృద్ధి చెందక పోయినా, ఇతర 'బి' తరగతి రాష్ట్రాలకంటే, కొన్ని 'ఏ' తరగతి రాష్ట్రాలకంటే ఎక్కువ అభివృద్ధినే సాధించింది. అయితే ఇతర రాష్ట్రాల్లో, మాదిరే హైద్రాబాదు రాష్ట్రంలోనూ తరతరాల నిర్లక్ష్యంవల్ల బాగా వెనుకబడివున్న ప్రాంతం వుంది. నీటి పారుదల సౌకర్యాలు లేనందువల్ల వ్యవసాయం చాలా వెనకబడి వుంది. వ్యవసాయం బాగా అభివృద్ధిచెంది వుండని ప్రాంతాల్లో పరిశ్రమలు కూడా అభివృద్ధికా లేవు. కనుక నే హైద్రాబాదు ప్రభుత్వం నీటి పారుదల సౌకర్యాలను కల్పించడానికి, కుటీర పరిశ్రమలను స్థాపించడానికి ద్వితీయ ప్రణాళికలో ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వవలసి వచ్చింది. ద్వితీయ ప్రణాళిక ఖర్చు అంచనాల్లో మూడోవంతు సాగు సౌకర్యాల అభివృద్ధికి కేటాయించడం జరిగింది.

హైద్రాబాదు ప్రభుత్వం మొదట 600 కోట్లరూపాయలకు పథకాలను తయారుచేసి ద్వితీయ ప్రణాళికకు రూపం కల్పించింది. రాష్ట్ర కనీసావసరాలను మాత్రమే దృష్టిలో పెట్టుకొని హైద్రాబాదు ప్రభుత్వం ఈ ప్రణాళికను తయారుచేసింది. అయినా ప్లానింగ్ కమిషను ద్వితీయప్రణాళికక్రింద హైద్రాబాద్‌కు ఆరువందలకోట్లరూపాయల ఖర్చును అంగీకరించడం సాధ్యంగాదని, అంచనాలను సగానికిపైగా తగ్గించాలని ఆదేశించింది. ప్లానింగు కమిషను ఒక్క హైద్రాబాదు విషయంలోనే ఈ వైఖరిని ప్రదర్శించలేదు. దాదాపు అన్ని రాష్ట్రాల ప్రణాళికలను ఇదేవిధంగా తగ్గించివేసింది. ఈ వైఖరిని ఆర్థికపరిస్థితులదృష్ట్యా సమర్థించవచ్చునుగాని, న్యాయసమ్మతమైనదని నిరూపించడం సాధ్యంగాదు. ప్రధానమంత్రి నెహ్రూ ఈ మధ్యనే వెనుకబడివున్న రాష్ట్రాల ప్రణాళికలను ప్రత్యేకంగా పరిశీలించవలసి వుంటుందని, ఆ రాష్ట్రాల అభివృద్ధి విషయమై ప్రత్యేకశ్రద్ధవహించవలసి వుంటుందని హెచ్చరించారు.

హైద్రాబాదు ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావుగారు [illegible] ప్రణాళికకు [illegible] హైద్రాబాదు ప్రణాళికకు 280 కోట్ల రూపాయల ఖర్చు అంచనాలపైనా ప్లానింగ్ కమిషను ఆమోదించగలదనే ఆశాభావాన్ని వెల్లడించారు. మొదట తయారుచేసిన అంచనాలను సగానికి సగం తగ్గించడం జరిగింది. అయినా ప్లానింగ్ కమిషను ఈ ప్రణాళికను విశేషమైన మార్పులు లేకుండా ఆమోదిస్తుందా అనే అనుమానం హైద్రాబాదు ప్రభుత్వానికి, ప్రజా ప్రతినిధులకు కూడా వున్నట్లు కన్పిస్తుంది. ప్రణాళిక అంచనాలను చూచి ప్లానింగ్ కమిషన్ ఆందోళన చెందడం నిర్హేతుకమే. ప్రణాళిక అమలు జరగడంలో దుర్వ్యయంగాని, దుబారా వ్యయంగాని లేకుండా కట్టుదిట్టంచేస్తే చాలును. ఒక్కొక్క పథకానికి రాష్ట్రప్రభుత్వాలు వేసిన అంచనాలు హెచ్చుగా వున్నవా, తక్కువగా వున్నవా అని పరిశీలించడం ముఖ్యం. ప్రణాళికను తయారుచేయడంలో కాలపరిమితికిగాక, సమగ్రాభివృద్ధికి ప్రాధాన్యం ఇవ్వడం అవసరం. ఎప్పటి కప్పుడే విధంగా పంచవర్ష ప్రణాళికలను తయారుచేయడం కంటే రాష్ట్రాల సమగ్ర, సర్వతోముఖాభివృద్ధికి ఒకే ప్రణాళికను తయారుచేసి ఆ ప్రణాళికలోని పథకాల కు వరుస క్రమాన్ని నిర్ణయించి అవి అమలుజరపడానికి కాలపరిమితిని నిర్ణయించడం ఎక్కువ ప్రయోజనకరంగా వుండవచ్చును. ప్రణాళికా రచన ఈవిధంగా జరిగినప్పుడు ఇన్ని మసాయిదాలనుతయారు చేయడంలో గల వ్యయ ప్రయాసలను నివారించవచ్చును. ప్లానింగ్ కమిషన్ అంత్య నిర్ణయాలను చేసే పూర్వం ఆయా రాష్ట్రాల వర్తమాన స్థితినికూడా పరిశీలించడం అవసరం.

ప్లానింగ్ కమిషన్ ఈ విషయాలన్నింట్నీ గమనించి, హైద్రాబాద్, ఆంధ్ర, ప్రణాళికలను ఎంత తగ్గించ వీలున్నదో అని గాక, ఎంత ఎక్కువగా అంగీకరించడానికి అవకాశం వున్నదో విచారించి న్యాయమైన నిర్ణయానికి రాగలదని ఆశిస్తున్నాము.

## నేపాల్ రాజకీయ పరిస్థితి

### కలిసి పనిచేసేందుకు 3 పార్టీల సమ్మతి

ఖాట్మండూ, ఆగస్టు 31: నేపాలీ కాంగ్రెసు, నేపాలీ నేషనల్ కాంగ్రెసు నేపాల్ ప్రజాపరిషత్ అనే 3 రాజకీయ పార్టీల నాయకులు నేడు రాజా మహేంద్రను కలుసుకొని తమ మూడు పార్టీలూ కలిసి ప్రభుత్వాన్ని ఏర్పరచేందుకు సిద్ధమని చెప్పినట్లు తెలుస్తున్నది. ఒకవేళ మూడుపార్టీలతోనూ మిశ్రమ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయటం యిష్టం లేకపోతే, తమలో ఏ ఒక్క పార్టీచేత మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసినా, మిగిలిన రెండు పార్టీలూ దానిని సమర్థించగలవని తెలియజేశారు.

రాజు తన నిర్ణయాన్ని తరవాత తెలియజేస్తానని చెప్తూ, ముందు ఆయా పార్టీల కార్యక్రమాలను తెలియజేయమన్నారు.

ఈ సంప్రదింపులకు మితవాద పక్షమయిన గూర్ఖా పరిషత్‌ను కూడా ఆహ్వానించారు. ఆ పక్షం ప్రతినిధులు లిఖిత పూర్వక ప్రకటన కాకపోవానిని రాజుకు సమర్పించి, సమావేశంలోనుంచి నిష్క్రమించారు.

## బాబూరావు అపీలు దాఖలు

నాగపూర్, ఆగస్టు 31: ప్రధాని నెహ్రూను హత్యచేయ ప్రయత్నించాడన్న నేరంమీద శిక్ష విధించబడ్డ రిక్షావాలా బాబూరావు పెట్టుకున్న అపీలును నాగపూర్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ జె. సి. శెట్ నేడు దాఖలు చేసుకున్నారు. విచారణ తేదీ తరవాత నిర్ణయిస్తారు.

మార్చి 12 న ప్రధానిపై హత్యాప్రయత్నం చేశాడని బాబూరావుకు 6 ఏళ్ల కఠిన శిక్షను జిల్లాజడ్జి విధించాడు.

## గోవాలో నావికుల చిక్కు

### అనుమతి పత్రాలున్నా భారతదేశంలోకి రావడానికి సౌకర్యాలు శూన్యం

బొంబాయి, ఆగస్టు 31: భారతదేశంలోనికి తరలి రావడానికి అనుమతి పత్రాలన్నీ సంపాదించుకున్న గోవన్ నావికులు సుమారు నాలుగువేల మంది కేవలం ప్రయాణ సాధనాలు శూన్యం అయిపోయినందువల్ల, రావడానికి వీలు లేక అక్కడ చిక్కుపడి ఉన్నారట. భారత జాతీయ నావికుల సంఘం కార్యదర్శి ఓ. సి. మెండెస్ ఈ సంగతి వెల్లడించారు.

ఈయన ఇవాళే గోవానుండి వచ్చారు.

అసలు నావికులేకాక గోవనులు వేల సంఖ్యలో భారతదేశం తరలి రావడానికి ప్రయత్నిస్తున్నారనీ, గోవాలోని భారత ప్రతినిధి కార్యాలయం మూసివేసేలోగా అనుమతి పత్రాలు సంపాదించుకోవాలన్న ఆదుర్దాలో వేలాదిజనం అక్కడ పడిగాపులు పడి నిలబారనీ ఆయన చెప్పారు. భారత ప్రభుత్వం విధించిన ఆర్థిక దిగ్బంధంవల్ల అక్కడ నానాటికీ, ఇబ్బందులు ఎక్కువవుతున్నవనీ, అందువల్ల చాలా మంది భారత ప్రాంతంలోనే ఉండిపోవాలనే ఉద్దేశ్యంతో ఇక్కడికి రావడానికి ప్రయత్నిస్తున్నారనీ మెండెస్ చెప్పారు.

అనుమతి పత్రాలు తెచ్చుకున్న గోవా జాతీయులందరినీ వారు కోరుకుంటే, భారత ప్రాంతంలోనికి ప్రవేశించనీయవలసిందని, సరిహద్దులోని పోలీసులకు భారత ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చినట్లు తెలిసింది గోవాలోని భారత ప్రతినిధి కార్యాలయం మూసివేసేలోగా, అక్కడి నావికుల వ్యవహారాలు పూర్తిగా పరిష్కరించాలనీ, చనిపోయినవారి భార్యలకు ఇవ్వవలసివున్న పింఛన్ మొత్తాలు లెక్కకట్టి, చెల్లించివేయాలనీ కూడా ప్రభుత్వం అక్కడి ఉద్యోగులను ఆదేశించింది ఈ కార్యక్రమాలలో అక్కడి భారతఉద్యోగులకు తోడ్పడే నిమిత్తం నావికులసంఘ కార్యదర్శి మెండెస్‌ను ప్రభుత్వం గోవా పంపింది. గోవాలోని భారత కాన్సల్ జనరల్ నావికులపట్ల ఎంతో సామభూతితో వ్యవహరిస్తున్నారనీ, సరిహద్దు దాటినపుడు ఇబ్బందులు కలిగితే తోడ్పడగలమని ధైర్యం చెబుతున్నారనీ మెండెస్ ఇవాళ చెప్పారు.

## అర్జెంటీనాలో ప్రదర్శనలు

### పెరాన్ రాజీనామా: ఉపసంహరణ

బ్యూనస్ ఎయిర్స్, ఆగ 31: అర్జెంటీనా అధ్యక్షపదవికి తాము రాజీనామా చేయదలచామని యువాన్ పెరాన్ నేడు పెరానిస్టా ఉద్యమ శాఖలు మూడింటికి వ్రాసిన లేఖలో తెలియజేశారు.

కార్మిక నాయకులు రేడియోలో వెంటనే ప్రసంగిస్తూ రాజీనామా ఉపసంహరించుకునేవరకు కార్మికులు, ప్రజలు, బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరపాలని ఆదేశించారు. సాయంత్రానికి లక్షమంది జనం ప్రభుత్వ భవనం ప్రక్కనఉన్న మైదానంలో సమావేశమయ్యారు.

పెరాన్ ప్రసంగిస్తూ దేశంలో కొన్ని వాక్కులను నిరాకరించినమాట నిజమేనని అయితే ప్రత్యేక సందర్భాలలోనే ఇది జరిగిందని చెప్పారు. తమ రాజీనామా మూలంగా దేశంలో ఐక్యత కుదురుతుందన్న ఆశాభావం ప్రకటించారు. కాని జనం గోలచేశారు.

"అలా అయితే, రాజీనామా చేయను సరే. కాని మనలో ఒక్కడు నేలకూలితే మన వ్యతిరేకులలో 5 గురు హతమయ్యేట్లు చూడండి" అని పెరాన్ ఆదేశించాడు. తర్వాత పెరాన్ తమ రాజీనామా ఉద్దేశం విరమించుకున్నట్లు రాత్రి ప్రకటనజరిగింది.

## ఆలూరుతాలూకా వరద బాధితులు అదనపు సహాయం

కర్నూలు, సెప్టెంబరు 1: ఆలూరు తాలూకాలో వరదవల్ల నష్టపడిన ప్రజలకు సహాయంచేసే నిమిత్తం ఆంధ్ర ప్రభుత్వం ఇంతకుపూర్వం ఇచ్చిన మొత్తంగాక మరి 8 వేల రూపాయలు మంజూరుచేసింది.

## భారతదేశంలో అణు పరిశోధన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: అణురియాక్టరు నెలకొల్పితే ఆసియా దేశాలలోని వారికి శిక్షణావకాశాలు లభించగలవని లోక్ సభలో నేడు ప్రధాని శ్రీ నెహ్రూ ఒక ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు. బ్రిటను, అమెరికా, ఫ్రాన్సులలో అణుశక్తికి సంబంధించిన విషయాలలో శిక్షణ పొందడానికి 18 మందిని పంపించామని చెప్పారు.

## ఇస్రేల్ ఈజిప్ట్ కొట్లాట

### పరస్పర ప్రతీకార చర్యలు

కెయిరో, సెప్టెంబరు 1: 1949 నుంచి కనీ విని ఎరుగనంత సంకులసమరం "ఖాన్‌యూనిస్" ప్రాంతంలో (గాజాకు 12 మైళ్లు దక్షిణంగా) రాత్రి 9 నుంచి 3 గంటలవరకు జరిగిందని ఈజిప్షియన్ యుద్ధశాఖ పాలస్తీనా వ్యవహారాలడైరెక్టరు కల్నల్ సాలాగోహర్ నేడిక్కడ చెప్పారు. నష్టాలవివరాలు తెలియలేదు.

ఇస్రాయెలీ సాయుధశకటాలు యుద్ధ విరమణరేఖ సమీపంలో ఒకగ్రామంపై కాల్పులు సాగించాయని దానిపై ఘర్షణ ప్రారంభమైందని అన్నారు.

అయితే ఇది ప్రతీకారచర్యగా తీసుకున్నామని టెల్ అవీవ్‌లో ఇస్రాయెలీ సైనిక ప్రతినిధి అన్నారు. ఒక ఇస్రాయెలీ సైనికుడు మరణించాడనీ 8 మంది గాయపడ్డారనీకూడ చెప్పాడు.

## పాక్ రూపాయి విలువ తగ్గింపు

### దొంగరవాణాలకు స్వస్తి

న్యూఢిల్లీ, ఆగస్టు 31: పాకిస్తాన్ రూపాయి విలువ తగ్గించటంతో పాకిస్తాన్‌నుంచి భారతదేశానికి వెండిని దొంగచాటుగా తీసుకువచ్చేలాభాలుగడించే అవకాశం తగ్గిపోయిందని రెవెన్యూ, రక్షణఖర్చుల మంత్రి శ్రీ ఎ. సి. గుహ లోక్‌సభలో ఇవ్వాళ తెలియచేశారు. పాక్ రూపాయి విలువ తగ్గించాక వెండిని ఇట్లా తీసుకురావటం మూడుసార్లు జరిగిందనీ, అయితే దీనికీ విలువ తగ్గింపుకీ ఏమీ సంబంధం లేదనీ కూడా మంత్రి అన్నారు.

## భీమవరం తాలూకాలో పంటలకు నష్టం

### పల్లపు గ్రామాలలో యాతనలు

భీమవరం, ఆగస్టు 31 భీమవరంతాలూకా మోగల్లు, కోరుకొల్లు, గరిగిపర్రు గ్రామాలకుచెందిన సుమారు 2000 ఎకరముల పొల్వాభూమి జలమయ మయినది. ఖైరవానికాల్వ కలిసే చోట ఒక తూము తలుపులు బద్దలై సుమారు 40 అడుగుల గండిపడి పెద్ద వెల్లువగా నీరు ప్రవహిస్తున్నది. భీమవరంనుంచి ఎనమదుర్రు మురుగుకాల్వ విస్సాకోడేరునుండిగా వచ్చే, గోస్తనదికాల్వ ఎనమదుర్రు లాకువద్ద కలుస్తాయి. ఖైరవాని కాల్వ వచ్చి ఎనమదుర్రు మురుగుకాల్వలో కలుస్తుంది. అధిక వర్షాలవల్ల ఎనమదుర్రు మురుగుకాల్వ పొంగి ప్రవహిస్తూన్నది. ఎనమదుర్రు, దిర్సుమర్రు, గరిగిపర్రు గ్రామాలవద్ద గట్లు తెగుతున్నవి.

అధికారులు తహశీల్దారు — శ్రీ యస్. లక్ష్మీకాంతంవారి సిబ్బందితో నిన్న రోజంతా గట్లమీద ఇసుక బస్తాలు వేయించి ప్రమాదంరాకుండా తగుచర్యలు తీసుకుంటున్నారు.

భీమవరం పట్టణంలో కమీషనరు తోట రంగారావునాయుడు - యావత్తు సిబ్బందితో రెండు రోజులనుంచి రాత్రింబగళ్ళు కాల్వగట్లు గట్టిపరుస్తున్నారు. చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు సమూహములుగావచ్చి వరద కాల్వను చూచిపోతున్నారు.

శెట్టిపేటనుంచి ఎక్జిక్యూటివ్ ఇంజనీరు ఏలూరునుంచి జిల్లాకలెక్టరు - నిన్న వచ్చి ప్రమాదం రాకుండా గట్టిచర్యలు యింకా తీసుకోవాలని అధికార్లను హెచ్చరించివెళ్లారు

ఈ ఉదయంకూడా నీటిమట్టం ఏమీ తగ్గలేదు — హెచ్చులోనే కనబడుతోంది.

ఈ వరదనీటివల్ల ముఖ్యంగా పల్లపు గ్రామాలు ఎనమదుర్రు, కొమరాడ, గొల్లవానితిప్ప, అజ్జమూడి, అనాకోడేరు, లోసరిగుటపాడు, దిర్సుమర్రు, దెయ్యాలతిప్ప, తోకతిప్ప - చెందిన వేలాది ఎకరాలపంటకు నష్టం వాటిల్లుతుంది. అందనా తెలియుటకు కొంత వ్యవధి పట్టును. (స్వ. వి.)

### నర్సాపురం ప్రాంతంలో పరిస్థితి

నర్సాపురం, ఆగస్టు 31: జిల్లాపోలీసు సూపరింటెండెంటు, జిల్లాకలెక్టరు నిన్న మధ్యాహ్నం యిక్కడికివచ్చారు. సబ్ కలెక్టరు బి. ఎల్. జయసింహగారు, భీమవరం, నర్సాపురంతాలూకాలలో వరదబాధిత ప్రాంతాలను తనిఖీచేస్తున్నారు. నదీజలాల సంరక్షణశాఖకు చెందిన ఓవర్సీర్ శ్రీ వి. రమణగారు, పొన్నపల్లివద్ద వరదకట్ట గండిపడకల ప్రమాదమున్నచోట కట్టను బలపరచి ప్రమాదం నివారించారు. వరదకట్టలు బలపరచడంలో ఉద్యోగులకృషి చాలా ప్రశంసాపాత్రంగాఉన్నది. ప్రజలు కూడా ఉత్సాహంతో సహకరిస్తున్నారు.

స్థానిక శాసనసభ్యులు గ్రంధి వెంకటరెడ్డినాయుడుగారు పేరుపాలి గ్రామం వెళ్లి వచ్చారు ఆ గ్రామంలో 50 యిళ్ళ చుట్టూ నీరుచేరిందనీ, రోడ్డుమీద మోకాలులోతున నీరు పారుతోందని చెప్పారు

### మంత్రిప్రయాణం

కర్నూలు, సెప్టెంబరు 1: రెవెన్యూ బోర్డు ప్రథమ సభ్యుడు శ్రీ కె. ఎం. ఉన్నితన్, రెవెన్యూ మంత్రి చంద్రమౌళిగారి వెంట గోదావరి వరద ప్రాంతాల పర్యటనకు వెడతారు. సెప్టెంబరు 3 నుండి పర్యటన ప్రారంభమౌతుంది. ఎక్కడికక్కడ తక్షణం, సహాయకార్యక్రమాలకు ఉత్తర్వులు యిచ్చేందుకు వీలుగా శ్రీ ఉన్నితన్ వెంట తీసుకొని వెడుతున్నామని చంద్రమౌళిగారు చెప్పారు.

## విజయవాడలో చెత్తచెదారం కుప్పలు

### ఆరోగ్య శాఖ అశ్రద్ధ: మంత్రి తీవ్ర అసంతృప్తి

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

విజయవాడ, ఆగస్టు 31: ఈ పట్టణంలో ఆరోగ్య శాఖ పని ఏమీ బాగులేదని స్థానిక స్వపరిపాలన శాఖా మంత్రి డా॥ ఎ. బి. నాగేశ్వరరావుగారు ఇవాళ తీవ్ర అసంతృప్తి వెల్లడించారు.

నాగేశ్వరరావుగారు స్థానిక సంస్థల ఇనస్పెక్టరు జనరలు అయోధ్యాపురం రాఘవరెడ్డి, రీజనలు ఇనస్పెక్టరు కె. రామకృష్ణయ్యచౌదరి పురపాలకసంఘాధ్యక్షులు పోతిన గణపతిరావుపాత్రుడు, ఉపాధ్యక్షులు దరిశాయి సుబ్బరామయ్య, టి. వెంకటేశ్వరరావు, కమిషనరు కె. సత్యనారాయణ, ఇంజనీరు తిరుమలరావు, పి. రామమూర్తి, ఆరోగ్యశాఖాధికారి డాక్టరు వేణుగోపాల్ శేషగిరిరావు గారలతో కలిసి పురపాలక సంఘ కార్యాలయాన్ని, పోతిన గణపతిరావుపాత్రుడు బండ్లదొడ్డిని, కృష్ణ వరదకట్టను పరిశీలించారు. ... చేయవచ్చునని, శ్రీ నాగేశ్వరరావుగారు సూచించారు. అక్కడనే ఒకరోడ్డుపై చెత్త విపరీతంగా పెరిగిపోవటం చూచి, ఎన్నాళ్లయి యీరోడ్డు ఊడ్చారని ప్రశ్నించారు. మూడురోజులయిందని సమాధానం చెప్పగా, అంటే ఆరోగ్యశాఖ యిలా పనిచేస్తున్నదని అన్నారు. అక్కడనే ఒక వరోయిలో నీరు ధారగా కారిపోయి రోడ్డుమీద ప్రవహించడం చూసి, ఇక సిమెంటు రోడ్లవల్ల ఉపయోగం యేమిటని ప్రశ్నించారు

### ఈ రోడ్డు ఊడ్చి ఎన్నాళ్లయింది?

అక్కడ చెత్తకుప్పలు రాశులు పెరిగిపోవటం చూసి, ఆరోగ్య శాఖ [illegible] ఇవాళ ... అన్నారు.

### మూడురోజులు అవసరం

పట్టణంలోని పరిస్థితులను స్వయంగా చూడటానికి ఒకరోజు ప్రత్యేకించి వస్తానని మంత్రిగారు అనగా, మూడు రోజులయినా అవసరమని అధ్యక్షుడు కోరారు. మూడురోజులు కావాలిక్కడ ఉంటే" విరామ కాల భాగసభరావ"ని ... శ్రీగారు అన్నారు.

## రొంపేరు భూముల పంపిణీ ఉత్తరువులు

### చెల్లవని హైకోర్టులో దరఖాస్తు దాఖలు

పొన్నూరు, ఆగస్టు 31: రొంపేరు భూములకు తమ సంఘం పేరపట్టాలు ఇప్పించవలసిందిగాను, ఈ 'రిట్' దరఖాస్తు విచారణ పూర్తిఅయ్యేలోగా ఆ భూములను ఖాళీ చెయ్యవలసిన అవసరం లేకుండా ఉత్తరువులు ఇవ్వవలసిందిగాను ఆంధ్రప్రభుత్వ ప్రతినిధులుగా రెవిన్యూశాఖ కార్యదర్శి, గుంటూరు జిల్లాకలెక్టరు, రొంపేరు భూముల ప్రత్యేక డిప్యూటీ కలెక్టర్లపై చేబ్రోలు రజక కాలుదార్ల సహకార సంఘం కార్యదర్శి శ్రీ వరపు సుబ్బయ్యగారు పెట్టుకొన్న దరఖాస్తును ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి విశ్వనాధశాస్త్రిగారు ఈనెల 28 వ తేదీని దాఖలుచేసుకొని ప్రభుత్వ ఉత్తరువును అమలుజరపవద్దని తాత్కాలికంగా ఉత్తరువు లిచ్చారు.

ఈ దరఖాస్తు వివరాలివి. సుమారు 170 రజక కుటుంబాలకు చెందిన 200 మంది ఈసహకారసంఘంలో సభ్యులు. రజక జన సేవాసంఘం అనే పేరున 1947 లో యీ సంఘాన్ని ఏర్పాటు చేశారు. వీ రందరూ చాలా పేదవారు. గుంటూరు జిల్లాలోని వివిధప్రాంతాల నుంచీ బ్రతుకు తెరువుకోసం మురుకొండపాడు శివారు, చేబ్రోలువచ్చి నివాసమేర్పరచుకొన్నారు. 1947 లో వారు ఆ గ్రామం వెళ్ళేటప్పటికే ప్రభుత్వం రొంపేరు పథకం అమలుజరప నారంభించారు. రజక జన సేవాసంఘానికి కొంత భూమి ఇవ్వమని కోరగా సహకార సంఘంగా రిజిష్టరు చేయించుకోవలసిందిగా అప్పుడు అధికారులు సలహా చెప్పారు. సహకార సంఘాన్ని రిజిష్టరు చేయవలసిందిగా కోరగా సంఘాన్ని రిజిష్టరు చేసే ముందు సభ్యులపేరట కొంతభూమి ఉండడం అవసరమని గుంటూరు డిప్యూటీ రిజిస్ట్రారు భావించి ఆ విధంగా జిల్లాకలెక్టరుకు వ్రాశారు. రొంపేరు ప్రాంతంలోని 600 నుంచి 650 సర్వే నంబర్లుగల 210 ఎకరాల భూమి తమ సంఘానికి ఇప్పించవలసిందిగా ఈ సంఘం గుంటూరు జిల్లా కలెక్టరుకూ, రెవిన్యూబోర్డుకూ దరఖాస్తు చేశారు. దానిమీదట భూములు ఇవ్వవలసిందిగా ప్రభుత్వానికి శిఫార్సు చేశాం కనుక సంఘాన్ని రిజిష్టరు చేయవలసిందిగా 16-4-1948 తేదీగల ఉత్తరువులలో జిల్లా కలెక్టరు డిప్యూటీ రిజిస్ట్రారుకు వ్రాశారు. అందుపై డిప్యూటీ రిజిస్ట్రారు సంఘాన్ని రిజిష్టరుచేసి ఈ సంఘానికి భూములు ఇప్పించవలసిందిగా జిల్లాకలెక్టరును మళ్ళీ అభ్యర్థించారు.

ఈ లోగా కొంతమంది ఆ భూములను ఆక్రమించుకొన్నారు. బాపట్ల తహసిల్దారుకు ఈ సంఘం ఫిర్యాదు చేయగా బాపట్ల స్టేషనరీ సబ్ మేజస్ట్రేట్ 144 వ సెక్షన్ ఉత్తరువులు జారీ చేశారు. ఆ భూములన్నింటినీ ఖాళీచేయించి వాటిని ఈ సంఘానికి ఇవ్వనున్నారని గ్రామంలో టముటమా వేయించవలసిందిగా మురుకొండపాడు గ్రామాధికారులను బాపట్ల తహసిల్దారు ఆదేశించారు.

ఆతరువాత సేషనల్ సబ్ మేజస్ట్రేట్ 144 వ సెక్షను ఉత్తరువులు జారీ చేయడం అక్రమదారులను వెళ్ళగొట్టటం, పంటను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం, 1360 వ ఫసలీలో భూములు ఈ సంఘానికి స్వాధీనం చేయవలసిందిగా తహశిల్దారు సిఫార్సు చెయ్యటం మొదలైనవి జరిగినవి. 1360 వ ఫసలీలో ఈ సంఘం అక్కడి 88 ఎకరాల భూమిని సాగుచేయడం జరిగినది. ఆ ఫసలీకి ప్రభుత్వం ఈ సంఘంవద్దనే శిస్తు వసూలు చేశారు.

ఆ తరువాత ఈ భూములను రాజకీయ బాధితులకు ఇవ్వాలనే ఉద్దేశంతో ప్రభుత్వం జారీచేసిన ఉత్తరువులు వాటి ఫలితంగా జరిగిన సంఘటనలన్నింటినీ దరఖాస్తుదారు వివరించారు. ప్రత్యేక డిప్యూటీ కలెక్టరును నియమించారు. ఈ సంఘానికి భూములు ఇచ్చే విషయం గురించి ఆక్షేపణలుంటే చెప్పవలసిందిగా ఆయన కోరారు. ఈ భూములకు సంబంధించి సంబంధింపారూ ఆక్షేపణలేమీ రాలేదు. 7-6-1954 వ తేదీన ఈ సంఘానికి ఆ భూముల ప్రక్కన 4 ఎకరాల నివేశనస్థలం మంజూరు చేశారు. రజకవాడను ఈ సంఘం నిర్మించుతున్నారు. ఈ పరిస్థితులలో 2-6-1955 వ తేదీన ఈ భూములలో కొన్నింటిని రాజకీయ బాధితులకు ఇవ్వాలనే ఉద్దేశంతో ప్రభుత్వం కొత్త ఉత్తరువులు జారీచేశారు. జిల్లా కలెక్టరుకు ఈ సంఘం పేరిట పట్టాలు ఇవ్వదలుచున్నారు. ఆ తరువాత రివిజన్ దరఖాస్తులను పెట్టుకొన్నా ప్రయోజనం లేకపోయింది. ఆ తరువాత భూములను ఖాళీచేయవలసిందిగా సంఘానికి ఉత్తరువులు ఇచ్చినవి. తత్ఫలితంగా లోగడ ప్రభుత్వం ఇచ్చిన ఉత్తరువుల వల్ల ఈ భూములపై తమకు ఏర్పడిన హక్కులకు ప్రమాదమేర్పడిందనీ, ఏ క్షణానైనా జిల్లా కలెక్టరు తమను భూములనుంచి వెళ్ళగొట్టవచ్చు కనుక ఆ ప్రమాదం నివారించడానికి తగు ఉత్తరువులు ఇవ్వవలసిందిగా దరఖాస్తుదారులు అభ్యర్థించారు.

భూములులేని పేదవారికి తలకు 2½ ఎకరాల మాగాణిగాని 5 ఎకరాలమెట్ట భూమిగాని ఇవ్వాలని ఆంధ్రప్రభుత్వం నిర్ణయించారు ఇప్పుడు ఈ సంఘం అధీనంలో ఉన్నభూమి ఆ విధంగా పంచితే వచ్చే భూమికంటే చాలా తక్కువ అని వివరించారు. 1361,1362 ఫసలీలకు ఈ 88 ఎకరాల భూమి ఈ సహకారసంఘంఅధీనంలోనే ఉన్నది.

రాజకీయ బాధితులకు ఇవ్వాలనే ఉద్దేశ్యంతో ఆ భూములను ఖాళీ చేయవలసిందిగా తమను కోరుతూ ప్రభుత్వం ఉత్తరువులు జారీ చెయ్యటం రాజ్యాంగంలోని 14, 15 నిబంధనలకు వ్యతిరేకమనీ, ఇతర పద్ధతులలో తమకు న్యాయం కలగనందున దరఖాస్తు పెట్టుకోవలసి వచ్చిందనీ వివరించారు.

భూములను ఖాళీ చేయవలసిందిగా ఇచ్చిన ఉత్తరువులను రద్దుచేయించవలసిందిగానూ, తమ పేర పట్టాలు ఇవ్వవలసిందిగా ప్రతివాదులకు ఆదేశించమనీ దరఖాస్తుదారు అభ్యర్థించారు. న్యాయమూర్తి దరఖాస్తును దాఖలు చేసుకొని, ప్రతివాదులు ఈ సంఘంచేత భూములను ఖాళీ చేయించకుండా తాత్కాలికంగా ఉత్తరువులిచ్చారు.

ఈ సంఘం తరఫున శ్రీయుతులు ఆవుల సాంబశివరావు, కె. ఎస్. సోమశేఖరరావు, పి. రామకోటి గారలు వాదించారు.

## పార్టీతో దేశముఖ్ భేదాభిప్రాయం

### కంపెనీల బిల్లు కొనసాగదని భావం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 1: నేడు లోక్ సభకు ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్ రాకపోవడంతో, కంపెనీల బిల్లులోని కొన్ని అంశాలపైన, సవరణలపైన కాంగ్రెసుపార్లమెంటరీ పార్టీకి ఆయన కు తీవ్రభేదాభిప్రాయాలొచ్చాయని గట్టివదంతులు వ్యాపించినవి.

ఇక యీ బిల్లును ఆమోదింపజేయలేమని శ్రీ దేశముఖ్ నేడు ఉదయం జరిగినపార్టీ కార్యవర్గ సమావేశంలో ఖచ్చితంగా ప్రధానికి చెప్పివేసినట్లు లాబీ వర్గాలద్వారా తెలుస్తోంది. మేనేజింగు ఏజెంట్ల కనీసజీతం, కార్యదర్శులు లేక కోశాధ్యక్షులు, యీ రెండు అంశాలపై ముఖ్యంగా భేదాభిప్రాయాలు వచ్చాయని తెలిసింది.

నేడు లోక్ సభలో యీ బిల్లులోని కొన్ని క్లాజులను రెవిన్యూ, ఖర్చు శాఖ మంత్రి శ్రీ యం. సి. షా. పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ బాలీరాంభగత్ సహాయంతో ప్రవేశపెట్టారు.

## వాతావరణం

మదరాసు, సెప్టెంబరు 1: ఆంధ్ర రాష్ట్రంలో అక్కడక్కడ జల్లులు పడ్డాయి. విశాఖలో 3 దుక్కుల వాన పడింది. 3 తేది ఉదయంలోగా శ్రీకాకుళం, విశాఖపట్నం ఉభయగోదావరిలు, కడప, కర్నూలు జిల్లాలందు వర్షంపడే సూచనలు కనబడుచున్నవి

శీతోష్ణస్థితి

| కేంద్రం | అత్యధికోష్ణం డిగ్రీలు | అల్పోష్ణం డిగ్రీలు |
|---|---|---|
| కళింగపట్నం | 89 | 79 |
| గన్నవరం | 91 | 78 |
| కాకినాడ | 89 | 76 |
| బందరు | 90 | 81 |
| నెల్లూరు | 97 | 89 |
| ఒంగోలు | 95 | 78 |
| రెంటచింతల | 92 | 74 |
| విశాఖపట్నం | 90 | 76 |
| అనంతపురం | 92 | 73 |
| ఆరోగ్యవరం | 86 | 70 |
| కడప | 92 | 76 |
| కర్నూలు | 88 | 72 |
| హైదరాబాదు | 85 | 71 |
| మదరాసు | 98 | 79 |
| బెంగుళూరు | 81 | 67 |
| బళ్లారి | 87 | 75 |
| న్యూఢిల్లీ | 95 | 71 |

## బ్రిటన్‌కు గ్రీస్ విజ్ఞప్తి

లండన్ ఆగస్టు 31: సైప్రస్‌లోని ప్రజల స్వయం నిర్ణయహక్కును బ్రిటన్, టర్కీలు, గుర్తించాలని గ్రీసు నేడు త్రైపాక్షిక సంప్రదింపుల సందర్భంలో కోరింది. గ్రీసు విదేశాంగ మంత్రి స్టీఫెన్ స్టెఫానోపౌలోస్ నేడు ప్రసంగించాడు. తరువాత సమావేశం రేపటికి వాయిదా పడింది.

## సంపాదకునకు లేఖలు

### విజయవాడ బెజవాడగా మారాలి

అయ్యా, విజయవాడ బెజవాడగా మార్చాలని బెజవాడ పురపాలకసంఘం వారు చేసిన తీర్మానం అనవసరమైన సందడిని కలిగించింది. విజయవాడ విజయవాడగానే ఉండాలని ఆందోళన లేవదీస్తున్నారు.

ఇంచుమించు వెయ్యి సంవత్సరాల క్రితం బయల్పడిన బెజవాడ యుద్ధమల్లుని శాసనంలో ఈనగరంపేరు బెజవాడగానే ఉన్నది. అతిప్రాచీనకాలం నుంచీ యీ నగరంపేరు 'బెజవాడ' అనేవున్నది. అందువల్ల విజయవాడ బెజవాడగా మార్చడం న్యాయం.

విజయవాడ, గూడూరు నరసింహాచార్య.

### సాంకేతిక పరీక్షల్లో స్కూలుఫైనల్ అర్హత

అయ్యా, ప్రభుత్వ వాణిజ్యపరీక్షల ప్రవేశానికి,స్కూలుఫైనలు అర్హతగాని, కళాశాల విద్యార్హతగాని ఉండాలని ఇటీవల ఆంధ్ర ప్రభుత్వం ఒకసర్క్యులర్ జారీచేసింది. ఇంతకాలంనుంచీ స్కూలుఫైనలు తప్పినా ఈ పరీక్షలకు ప్రవేశార్హత ఉండేది. కాని యిప్పుడది తీసివేశారు. ఇందువల్ల బీదవిద్యార్థుల సేకులు ఉద్యోగాలులేక అల్లాడవలసిన పరిస్థితి యేర్పడింది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలు జరిపే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఎంతోమంది విద్యావంతుల అవసరం ఉన్నది ఈ పరిస్థితులలో యీ నిబంధన ఏమీ సబబుగాలేదు. కనుక యిది తొలగించి చాలామందికి వాణిజ్యపరీక్షా ప్రవేశార్హత కలిగించాలని కోరుతున్నాను. యద్దనపూడి వెంకటేశ్వరశర్మ, విజయవాడ.

### ప్రభుత్వ సమాచారశాఖ విమర్శన

అయ్యా, 3-7-55 తేదీగల ఆంధ్ర పత్రికలో నేను, ఆంధ్రరాష్ట్రంలో నీటిపారుదలపథకాలగురించి వ్రాశాను. అందులో కృష్ణారోడ్డు బ్రిడ్జి రెగ్యులేటరు నిర్మాణాన్నిగురించి వ్రాస్తూ "దీని ఖర్చు మొదట్లో 1 కోటి 56 లక్షలు. తరువాత దీనిని 2 కోట్లు 72 లక్షలని అంచనావేశారు. ఈ నిర్మాణ పథకం చురుకుగా సాగుతున్నది" అని వ్రాశాను.

ఆంధ్ర ప్రభుత్వ సమాచారశాఖ దీన్ని సరిదిద్దడానికై 5-8-55 న ఒక ప్రకటన చేసింది. దానిలో పై వ్యాసంలో ఉదహరించిన మాదిరిగా రెగ్యులేటర్ అంచనావేయలేదనీ, బ్రిడ్జి సహిత్నన రవాణాశాఖ 2.71 కోట్ల రూపాయలు మంజూరుచేసిందనీ అది తిరిగి మార్పుచెయ్యబడలేదనీ వ్రాశారు. ఇంకా ఈ ప్రణాళికకు సాంకేతికంగా మంజూరైన అంచనా సొమ్ము, పనులకు 2 కోట్ల 66 లక్షల 31 వేల రూపాయలనీ, పరికరాలు మొదలైనవాటి కన్నింటికి కలిపి 2 కోట్ల 84 లక్షల 15 వేల రూపాయలనీ, దీటిలో మార్పు లేవీ చెయ్యలేదనీ వ్రాశారు.

నేను ఈ ప్రణాళికను గురించి వ్రాయడానికి కేంద్ర జలవిద్యుత్ శాఖ ప్రకటించిన "ఆంధ్రలో జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులపై నోట్సు" అనే పుస్తకంలో స్పష్టంగా వ్రాసిన విషయాలే తీసుకున్నాను. కేంద్రప్రభుత్వం ఆంధ్రప్రభుత్వ నివేదిక ఆధారంగా తీసుకొని పై విషయాలు వ్రాసింది.

ఇందువల్ల ఆంధ్ర ప్రభుత్వ సమాచారశాఖ విమర్శన సరికాదు. నా వ్యాససభాగం తప్పయితే కేంద్రజలవిద్యుత్ శాఖలో ప్రకటించిన నోట్సు తప్పు కాగలదని మనవి చేస్తున్నాను.
వత్తెనపల్లి, మూదల వీరభద్రరావు.

### కర్నూలుజిల్లా రైతులకు వర్షబాధలు

అయ్యా, ఒక నెలరోజులనుండి కర్నూలు జిల్లాలో విపరీతంగా వర్షాలు కురవడంవల్ల రోడ్లు రహదార్లు మొదలైనవన్నీ జలమయమైపోయాయి. బీదప్రజ రైతులు అనేక విధాలుగా అవస్థలు పడుతున్నారు. ఈ వర్షాలవల్ల పంటలన్నీ పాడైపోయి తిండిగింజలు లేక బాధపడవలసి వస్తుందేమోనని ప్రజలు భయపడుతున్నారు. ఈ పరిస్థితులలో ఈ ప్రాంతాల శాసనసభ్యులు పల్లె పల్లెకు తిరిగి ప్రజల కడగండ్లు కళ్ళారా చూచి ప్రభుత్వానికి నివేదించి కాయకష్టులా సాయపడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. శాసనసభ్యులు, ప్రభుత్వము, వెంటనే ఈ విషయంలో శ్రద్ధవహించగలరని ఆశిస్తున్నాను.
యెమ్మిగనూరు బి. యం. సంగన్న.

### ధాన్యంధర

అయ్యా, రైతులు ధాన్యంధర నిలబెట్టవలసిందని ఆందోళన చేశారు. ఈ విషయం ప్రభుత్వం గుర్తించినందుకు ఆనందిస్తున్నాము. కాని కేంద్ర ప్రభుత్వం ధాన్యంధర మణుగు ఏడు రూపాయలని నిర్ణయించడం మిక్కిలి శోచనీయము. ఈ ధర రైతుల కేమాత్రము గిట్టుబాటు కాదు. 1952 నించీ రైతాంగానికి వ్యవసాయపు ఖర్చు లేమాత్రమూ తగ్గలేదు. రైతులు కొనవలసినవస్తువుల ధరలు కూడా ఏమాత్రము [illegible] కేంద్రప్రభుత్వం [illegible] ధాన్యంధర మణుగు 8 రూపాయలకు తక్కువ [illegible] నిర్ణయించవలసిందిగా కోరుతున్నారు. నరిశెట్టి సత్యనారాయణ
గుంటూరు గుంటూరుజిల్లా కిసాన్ సమితి ప్రధాన కార్యదర్శి.

